శ్రీ

# శ్రీరామ శతకము.



శ్రీ భీమరాజ వంశ సంభూతయగు:

## మంచిరాజు సీతమాంబ కృతము.



వెల రు 0—1—0.

శ్రీ

# శ్రీరామ శతకము.



శ్రీ భీమరాజ వంశ సంభూతయగు

## మంచిరాజు సీతమాంబ కృతము.



శ్రీరామచంద్రమూర్తయేనమః.

# శ్రీ రామ శతకము.



శ్రీజానకి వరరమణా
నాజాలియు మాన్పి గావు । నలినదళాక్షా
నేఁజాలఁగఁ వేడితి నిను
రాజితపాదారవింద । రఘుకులరామా. ౧

తల్లియుఁ దండ్రియు నీవని
యుల్లము నీయందు నిల్పి । యుంటినిగాదే!
కల్లగఁ దలచకు శ్రీహరి
చల్లగఁ దయఁ జూడునన్ను । జానకిరామా. ౨

కరివరదా! భయరహితా!
అరమరసేయకుము గావు । మఖిలాధారా
పరమదయానిధి మునినుత
అరవింద దళాక్ష రార । యచ్యుతరామా. ౩

హరివని నెరనమ్మితి నిను
మురహరివని వేడుచుంటి ఽ మోహనరూపా
సురులనుఁ గాచిన దొరవే
సరసిజ దళనేత్రరార ఽ సద్గుణరామా. ౪

సోమకుఁడనియెడు దైత్యుని
తామసు వేదాపహారుని ఽ దండించి భువిన్
ప్రేమమున శ్రుతులు నిల్పిన
శ్రీమహిళాభర్త! నుతిని ఽ చేసెదఁ రామా. ౫

పొందుగ దేవాసురులొక
మందరగిరితోడను దధి ఽ మధియింపంగన్
పొందిక గచ్ఛప రూపున
మందరమును మోసినావు ఽ మహిమను రామా. ౬

ఖగపతి వాహన మాధవ
నగధర నిను గొల్చువారు ఽ నరకమునకు బో
వఁగఁబని లేదటగదరా
జగముల సృజియించునట్టి ఽ జాణుడ రామా. ౭

కమలాప్త వంశమున నీ
వమలమతివిగాఁ జనించి ఽ యవనిని సమభా
వమునను పాలనజేసిన
కమనీయ దళాక్షరార ఽ కరుణను రామా. ౮

నిను దలచెడి వారికి నెం
దును మోసము లేదు లేదు ౯ తోయజనేత్రా
కనికరముంచుము నాపై
అనుదినమును వేడుచుంటిఁ ౯ ఖ్యాతిగరామా. ౯

పరమదయాకర రారా
కరుణారస పూర్ణజలధి ౯ కావుము నన్నున్
శరణన్నఁ బగతు తమ్మునిఁ
బరమకృపను గాచినట్టి ౯ పావనరామా. ౧౦

మిత్రకులంబున బుట్టి సు
మిత్రసుతుడు కొల్చుచుండ ౯ మెచ్చుగ నీవున్
క్షత్రియ ధర్మముఁ దప్పక
కృత్రిమమతులను మదమడ ౯ గించినరామా. ౧౧

అండజవాహన నేనీ
యండను జేరితినిగావు ౯ మఖిలాధారా
కుండలిశయనా కేశవ
పండిత సంస్తుత్య పరమ ౯ పావనరామా. ౧౨

వింతల రూపులతో నీ
వంతట వసియించునట్టి ౯ హరిహరతేజా
చింతములు మాని నాదగు
చింతల నడగించరార ౯ శ్రితజనరామా. ౧౩

భవహార నీ యుదరంబున
భువనంబులు పదియునాల్గు ఽ పొందుగనుండ
న్నవనవ రూపులతోడన్
భువిలో జనియించు నేర్పు ఽ బూనినరామా. ౧౪

మునివరు వెనువెంటనుజన
తన కపకారంబుసలుప ఽ తాటకి రాగన్
బనిఁబూని దాని నొకశర
మునగూల్చిన ధీరుడవుగ ఽ భువిలో రామా. ౧౫

కోటి తపన తేజుడ నీ
సాటి యెవరు లేరుగాద ఽ సారసనేత్రా
మాటికి నాదగు తప్పుల
సూటిగ జూడంగ దగదు ఽ సుందర రామా. ౧౬

దశరధ రాజకుమారా!
శశిధరువిలు విరచినట్టి ఽ జనకజ నాథా
దశముఖసంహార నిను నా
వశమా కొనియాడగాను ఽ భవహార రామా. ౧౭

అంజని పుత్రునిగాచిన
కంజనయన వరదనన్నుఁ ఽ గావనురారా
అంజలి నిడితిని నీకును
మంజులతర వచనరచన ఽ మానితరామా. ౧౮

గౌతమముని శాపముచే
నాతిశిలగఁ బడినదాని । నరవరవేగఁ
బ్రీతిని బ్రోచితిగద వి
ఖ్యాతింజేకొనిన భక్త । కాముడరామా. ౧౯

ఒకచోటనుండి మఱి వే
రొకచోటున లేవనంగ । నొప్పదు సుమ్మీ
అకుటిలమతివై యన్నిటఁ
బ్రకటితముగ వెలుగుచుండు । ప్రౌఢుడరామా. ౨౦

అంగన నీకొసగిన యా
యెంగిలి ఫలములఁ భుజించి । యెంతోదయచే
హంగుగ మోక్షంబిచ్చిన
రంగా నిను బొగడవశమె । రవికులరామా. ౨౧

మాధవ మునినుతరారా
శ్రీధరయని నను దినంబు । చింతించెదనిన్
గాధిసుతుయజ్ఞ రక్షక
సాధుజనావన ముకుంద । సద్గుణరామా. ౨౨

శంకర వందిత చరణా
సంకటహార నిన్నునమ్మి । సన్మార్గముచే
పంకజనయనా మానులు
పొంకముగా మోక్షమునకు । బోయిరిరామా. ౨౩

మదిలోఁ నమ్మితినిను నే
ముదముగఁ ధ్యానించుచుంటి ఽ మురహరివరదా
యదుకుల సంజాతుడవై
సుదతులఁగావంగ లేద ఽ సుముఖుడరామా. ౨౪

రేపులు గడుపకు శ్రీహరి
వాపోవుచు నున్నదాన ఽ వరదా రారా
నీపాదభక్తి నాకును
యేపొద్దును గల్గ వరము ఽ నివ్వర రామా. ౨౫

పీతాంబరధర గావర
సీతాపతి! భక్తజన సు ఽ సేవిత ధీరా
భూతలమున నిను దలచిన
పాతకములు తొలగిపోవుఁ ఽ బావన రామా. ౨౬

వరశంఖు చక్రధారీ!
పరమాత్మా పరమపురుష ఽ పావన నామా
నిరతము నీనామము నే
మరకే నుతియించు దాన ఽ మాధవ రామా. ౨౭

జగదీశ్వర కరుణాకర
ఖగపతి వాహన ముకుంద ఽ కమలా నాథా
నిగమాగమ సంచారా
అగణితగుణ మాన్యుడవు మ ఽ హాత్మా రామా. ౨౮

శ్రీకాన్తా హృన్నిలయా
పాకారి ప్రముఖవినుత వసుధాధీశా
లోకాతీత విహారా
నాకోర్కెలు దీర్చరార నరవర రామా. ౨౯

వాసవ వందిత కేశవ
దాసజనావన ఖరారి తాపసపోషా
కౌసల్యా గర్భరత్నమ!
భూసుత హృదయాబ్జభృంగ పూజిత రామా. 30

శరనిధివర గంభీరా
పరమదయాకర సురవర భావజ జనకా
నరహరి భక్తాభీష్టా!
పరమాత్మా గావరార భవహరరామా. 3౧

భక్తజనావన కేశవ
నక్తంచర వైరి వీర నరహరిరూపా
భక్తిగ నిను పూజించిన
ముక్తిని పొందుదురు గాద మునివర రామా. 3౨

యోగీశ హృదయనిలయా
వాగీశామరసుపోష వందిత రూపా
భోగిశయన గోవిందా
వేగముగాఁ నన్ను గావు ప్రేమనురామా. 33

కిన్నర గణనుతచరణా
పన్నగపతి సంస్తుతాత్మ ఽ పంకజనేత్రా
అన్నులమిన్నలఁ బ్రోచిన
మన్నీడా గావుమయ్య ఽ మధురిపురామా. ౩౪

లీలామానుష ధారీ
పాలకడలి మనికిరేడ ఽ వాసవ వంద్యా
చాలగ నుతియించెద నిను
కాలహరణమేల నన్ను ఽ గావుమురామా. ౩౫

గుడిగోపురంబులను నే
గడనకు గట్టించలేదు ఽ కౌస్తుభధామా
భిడియము విడి నీనామము
వడివడి నుతియించుదాన ఽ వసుధరరామా. ౩౬

అన్నపు సత్రంబుల నే
నెన్నడు గట్టించలేదు ఽ నృపకుల వీరా
వెన్నుడ నీనామావళి
పన్నుగ నుతియించుదాన ఽ భవహరరామా. ౩౭

తిరుణాలలఁ సేవింపగ
పరుగిడలే దాత్మయందుఁ ఽ బ్రస్తుతిచేతున్
సరసిజ నాభాయని నిన్
మరిమరిఁగొనియాడుచుందు ఽ మధురిపురామా. ౩౮

సారసనయన ముకుందా
కోరితి నీపాదసేవ కువలయధామా
నేరము లెంచకు శ్రీధర
సారెకు నిను వేడినాను సద్గుణరామా. ౩౯

సుజనుల బ్రోచెడివాడా
అజరుద్రామరులనుతిని నందిన రేడా
నిజముగ నిను నమ్మిన యా
గజరాజును గావలేద ఘనముగరామా. ౪౦

అక్షీణ దివిజపాలన
పక్షిగమన సురనికాయ వందితరూపా
శిక్షింపవె దానవులను
రక్షిత సురబృందరార రఘుకులరామా. ౪౧

బంగరు పుట్టము గట్టుక
శృంగారముగా నటించు సురుచిర దేహా
అంగదుఁ గరుణించిన భవ
భంగా దయజూడరార వసుధనురామా. ౪౨

పటుతరముగ నిను నమ్మిన
జటాయువును గావలేద సద్గుణమిత్రా
నటనలు సల్పెడి శౌరీ
కట కట బెట్టకుము కరుణ గావర రామా. ౪౩

కామిత ఫలదా కేశవ
కోమల హృదయారవింద ఽ గురుతర తేజా
నీమముతో నినుదలతును
ప్రేమను జూడంగరార ఽ నృపకులరామా. ౪౪

కనకాక్షుడు భూదేవిని
గొనిచన భూధార రూప ఽ కుడవై వేగన్
మునివగులు బొగడ వానిని
ఘనముగ వధియించి కీర్తిఁ ఽ గంటివి రామా. ౪౫

సారసనేత్రా శుభకర
శ్రీరమణీ హృదయనిలయ ఽ శ్రితజనపాలా
కారుణ్యాకరమూర్తీ
పోరాటము మాని నన్ను ఽ బ్రోవవె రామా. ౪౬

పరమకృపాకర జలధే
సురగణనుత చరణపద్మ ఽ శుభగుణశౌరీ
నిరుపమగుణ గణధీరా
కరమరుదుగ నమ్మియుంటిఁ ఽ గావుము రామా. ౪౭

ఆగమ సంచారా! భవ
సాగరతరణా! సురగణ ఽ సంస్తుతధీరా
భోగిశయన గోవిందా!
రాగద్వేషాదిరహిత ఽ రవికులరామా. ౪౮

కోటిమదనరూపా! నీ
సాటియెవరు లేరు లేరు ౹ సద్గుణజాలా
హాటకవరసింహాసన
తాటక సంహారకార ౹ దశరథరామా. ౪౯

దీనదయాళో రిపుహర
దానవసంహార ధీర ౹ ధార్మికమూర్తీ
మౌనిజనహృదయ నిలయా
మానిత సుకుమారదేహ ౹ మాధవరామా. ౫౦

నీరజనాభా! వరదా!
నారదముని సంస్తుతాత్మ ౹ నగధరశూరా
నారాయణ జగదీశ్వర
కారుణ్యామృతసువాక్య ౹ కామితరామా. ౫౧

బృందారక గణసేవిత
మందరధరసుందరాంగ ౹ మంగళరూపా
వందిత మృదుపదపద్మ! ము
కుందా! నమ్మితినిగావు ౹ కోసలరామా. ౫౨

దరహాస వదన శ్రీహరి
పరమకృపాకర శుభగుణ ౹ భక్తగణేశా
ధరణీధర సురపోషా
సరసీరుహనేత్ర శూర ౹ సన్నుత రామా. ౫౩

మందస్మితాస్య మునివర
సుందర వదనారవింద ఽ సూర్యకులేశా
కందర్పజనక! కరుణా
నందజలధి దేవవినుత ఽ నరవరరామా. ౫౪

దీనదయా పరమూర్తీ
వానరసేనా సమూహ ఽ వారిజ నయనా
ఆనందామృత సాగర!
కానల జరియించు నేర్పుఁ ఽ గాంచిన రామా. ౫౫

అసురేశ్వరు వరతనయుని
పసిపాపని గావలేద ఽ భక్తుడటంచున్
వసుధరశౌరీ నరవర
మసలకనను బ్రోవవేగ ఽ మగువను రామా. ౫౬

కమలదళనేత్ర శ్రీధర
రమణీయాంచిత చరిత్ర ఽ రంజితగాత్రా
కమలాసనాది సురనుత
కమలాహృదయాబ్జ భృంగ ఽ గావరరామా. ౫౭

శీలముచెడి సోదరసతిఁ
జాలిని విడికొనినయట్టి ఽ జాల్మని వాలిన్
గూలిచి యినజుని బ్రోవవె!
కోలాహలమేల రార ఽ కోరితి రామా. ౫౮

మునిసతి శాపము బాపిన
ఘనతర సుకుమార దేహ ఽ కామిత ఫలదా
కనకాంబరధర శూరా
జననాయక నిన్నుఁ బొగడఁ ఽ జాలను రామా. ౫౯

గోవిందా ! రిపుమర్దన !
గోవర్ధన ధరముకుంద ఽ గోపక వేషా
గోవులగాచిన వీరా
నావెరపును దీర్చరార ఽ నరవరరామా. ౬౦.

సరసిజనేత్రా వరదా
పరమాత్మా ! సన్నుతాంగ ఽ పావనగాత్రా
సురగణసేవితమూర్తీ
పురహారనుత చరణభక్త ఽ పోషక రామా. ౬౧.

లెక్కకు మిన్నగు రాజులు
చక్కగ నిను జూచుచుండ ఽ చతురతమెరయన్
రక్కసిఁ జంపినవాఁడా
గ్రక్కున హరు విలు విరచిన ఽ ఘనుడవురామా. ౬౨.

హనుమంతుని రక్షించిన
ఘనవంతుడవైన ప్రభువ! ఽ కామితవరదా
మునిగణ వందితరూపా
వినుతించెద గావరార ఽ వేగమె రామా. ౬౩

ఇనసుతుడగు సుగ్రీవుని
వనమాలీ కావలేఏ ! వాసవ వంద్యా
సనకాది మునీంద్రస్తుత
ఘనకోమలదేహ రార ॥ కరుణనురామా. ౬౪

వారిజనయనా! భవహర!
నీరద నిభగాత్రవరద ॥ నిర్మల తేజా
వీరాధివీర శుభకర
కోరితి నను గావరార ॥ కోమలరామా. ౬౫

ఉదధినివాసా! శ్రీధర
విదితమృదు పదారవింద ॥ వేదోద్ధరణా
మది నమ్మియుంటిఁ గావర
సదయహృదయ సుందరాంగ ॥ సద్గుణరామా. ౬౬

సీతావల్లభ శ్రీహరి
రాత్రించరవైరి! సుగుణ ॥ రంజితవేషా
భూతేశ! పరమపురుషా!
పాతక సంహారవిరాధ ॥ భంజనరామా. ౬౭

రావణసంహార! వీరా
కావర మడగించలేద! ॥ కాకాసురునిన్
సేవిత సురగణనిలయా
బ్రోవుమనుచు వేడినాను ॥ పూజితరామా. ౬౮

దుష్టాసుర సంహార! శ్రీ
విష్టాధిపసేవి తరణ ఽ వీరసురేశా
కష్టంబులఁబడజాలను
సృష్టిపతీ నన్నుగావు ఽ శీఘ్రమెరామా. ౧౯

మకరాంతక! మురవైరీ!
ప్రకటిత భక్తజనపోష ఽ భవహరశౌరీ
వికసితపంకజలోచన
సుకుమారాన్విత శరీర ఽ శుభకరరామా. ౨౦

అక్షయశుభగుణ నిలయా
పక్షికులేశ్వర సువాహ ఽ భాసురదేహా!
రక్షిత భక్తజనేశ్వర
తక్షణమున నన్నుగావు ఽ దశరథరామా. ౨౧

ప్రేమా! రఘుకులసోమా!
రామా! జానకిమనోజ్ఞ ఽ రంజితధామా!
కోమల సద్గుణనామా!
భ్రామికననుదలతు నెపుడుఁ ఽ బార్థివరామా. ౨౨

రమణీయాంచిత నేత్రా
విమల పదాంబుజ సురేశ ఽ వేదవిచారా
సమరవిశారద శ్రీహరి
కమలాహృదయేశరార ఽ ఘనముగరామా. ౨౩

నిగమాగమ సువిచారా
జగదోద్ధారక మురారి ! శశిధరవినుతా
అగణిత మణిమయభూషా
నగధీరా నన్నుగావు ! నరవర రామా. ౭౪

రాజిత శుభగుణభాషా
పూజితసురబృందపోష ! పూర్ణసువేషా
రాజకులాధిప భూషా
ప్రాజదువులు జదువనేర ! భవహర రామా. ౭౫

సుకుమార గాత్ర మాధవ
అకలంకాన్వయ చరిత్ర ! హరివరశయనా
సకలైశ్వర్యనివాసా
ప్రకటిత భక్తజన హృదయ ! పంజరరామా. ౭౬

సీతామానస నిలయా
ధాతాది ప్రముఖభాష ! తాపసపోషా
భూతలపతి నుతపదయుగ
శాతమణి స్థగితమకుట ! జయరఘురామా. ౭౭

రామా! రాక్షసభీమా!
భామామణి సీతహృదయ ! పంకజధామా!
కోమలశుభ గుణనామా!
వేమరు వేడితిని గావు ! వితరణరామా. ౭౮

మునిజనవర సంరక్షా
కనకాంబర ధరసువక్ష § కంజదళాక్షా
ఇనసుతు సైన్యసుపక్షా
కనికరమున గావరార § కరివరరామా. ౭౯

సరసీరుహాక్షి శబరిని
పరమకృపను బ్రోవలేద § భండనభీమా
దురితాంతక దేవేశా
గరుడగమన నన్నుగావు § కరుణను రామా. ౮౦

కోసల దేశాధీశా
భాసుర మణిభూషణాంగ § పరమానందా
వాసవవందితశౌరీ
వేసరితిఁ నుతించి గావు § వేగమె రామా. ౮౧

జగదాధారక కేశవ
అగణిత సంసార దుఃఖ § హంతకమూర్తీ
విగత భవపాశ బంధన
సుగుణజనావన మురారి § సురనుతరామా. ౮౨

హరిచందన లిప్తతనూ!
సురగరుడోరగ సుసేవ్య § సుందర రూపా
కరుణామృత సాగర! పుర
హరనుత హాటక సురత్న § హారా! రామా! ౮౩

అక్రూరవరద శ్రీధర
చక్రాయుధ ఖడ్గహస్త ॥ సారసనేత్రా
విక్రమ సురసంసేవిత
నక్రాంతక నన్నుగావు ॥ నగధర రామా. ౮౪

సుగుణాకర సర్వేశా
అగణిత మోహాంధకార ॥ హంతక తేజా
నిగమాగమ సంవేద్యా
ఖగపతి సంరక్ష నన్ను ॥ గావుము రామా ౮౫

ఘటకర్ణాసురహంతక
నిటలనయన వినుతనామ ॥ నీరదగాత్రా
పటుతర మునిగణ రక్షా
దిటవుగఁ నుతియించుచుంటి ॥ దినమిఁక రామా ౮౬

కనకాంబరధర మాధవ
జనకునియాజ్ఞానుసార ॥ సర్వాధారా
ఘనమునిజన సంసేవిత
దనుజాంతక నన్నుగావు ॥ దశరథరామా ౮౭

పశుపతి సన్నుతకామా
దశరథవర పుత్రరత్న ॥ తారకనామా
విశద గుణోన్నతధామా
నిశాచరేశ్వర విరామ ॥ నిర్జితరామా ౮౮

సన్నుత సుజన నివేశా
పన్నగపతిశయన వరద ∫ పాపవినాశా
మన్నించుము జగధీశా
పన్నగ నుతియించుదాన ♦ భక్తిని రామా. ౮౯

సకల గుణాకర వీరా
వికసిత వదనారవింద ∫ విశ్వాధారా
అకుటిల సుజనవిచారా
ప్రకటముగా నన్ను గావు ∫ రఘుకులరామా. ౯౦

నారద మౌనీంద్రస్తుత
నీరదనిభగాత్ర వరద ∫ నిత్యానందా
నీరజనేత్ర సురేంద్రా
వారధి బాధనకబంధ ∫ భంజనరామా. ౯౧

మోక్షనివాసా శ్రీహరి
దాక్షిణ్యామృతమనోజ్ఞ ∫ తాపసవినుతా
రాక్షస సంహారవీరా
ఈక్షణమున నన్ను గావు ∫ మినకులరామా. ౯౨

శ్రితజనపోషక మాధవ
సతతానంద పరిపూర్ణ ∫ సద్గుణజాలా
వితత యశోధర! సుర సే
వితమోహానరూప వేద ∫ వేద్యుడరామా. ౯3

ఘనసుగుణాకర జలనిధి
వినతాసుతు వినుతనామ ॥ శేషజరహితా
వనచరపరిపోషక! ని
న్ననవరతము నమ్మియుంటి ॥ నచ్యుతరామా. ౯౪

ఉదధినివాసరమేశా
సదమల హృదయారవింద ॥ సాధుగణేశా
విదితామరగణపోషా
ముదముగ ధ్యానించుచుంటి ॥ మునివరరామా. ౯౫

ఇనవంశోద్భవ కేశవ
వనమాలాంచిత సుగాత్ర ॥ వాసవ వినుతా
సనకస నందన వంద్యా
జనకజచిత్తాబ్జభ్రమర ॥ జయరఘురామా. ౯౬

జయ రవికుల వరదీపక
జయ కరుణాహృదయనిలయ ॥ జయ పరమేశా
జయ సురవరనుత శ్రీధర
జయమంగళకర శుభాంగ ॥ జయరఘురామా. ౯౭

అనుజత్రయ పరివేష్టిత
ఘనసారాగరుసుగంధ ॥ కౌస్తుభధామా
ఘనసామ్రాజ్య నివేశా
ధనపతి సంస్తుత సుధీర ॥ దశరథరామా. ౯౮

ఆహా రఘుకుల తిలకా
ఓహో నినుబొగడనేర ౯ నుర్వీనాథా
ఊహా విశేషమనదగ
దాహాయివి యేమివింత ౯ లచ్యుతరామా. ౯౯

సారసనేత్ర సురావన
కోరికమీరంగఁ రార ౯ కువలయ నాథా
ఏరాధి వీర! నే నీ
తీరునఁ శతకంబు నిడితిఁ ౯ దినకరరామా. ౧౦౦

శ్రీ భీమరాజ వంశ జ
శోభిత శ్రీ సీతమాంబఁ ౯ సుస్థిరమతితో
శ్రీ భద్రగిరీశునిపై
ప్రాభవకృతి దీనిఁ గొనుము ౯ భవహరరామా. ౧౦౧

సంపూర్ణము.

---

తెనాలి భారతీ ముద్రాక్షరశాలయందు ముంద్రిపఁబడియె. 1934.

